# నీతి వాక్య రత్నాకరం



# పీఠిక.

1. మహాజనోయేన గతస్సపంథాః = సజ్జనుల మార్గము
మనమవలంబింపవలెను.
2. ఆచారః ప్రథమోధర్మః = సత్ప్రవర్తన పుణ్యకార్య
ములలో మొదటిది.
3. శీలం సర్వత్ర భూషణమ్ = సత్ప్రవర్తన మనిషికి ఎ
ల్లెడల నలంకారము.

ఈగ్రంథమును స్వోపయోగము కొఱకును 1 అబ్దుల్ అజీజ్, 2 అబ్దుర్రషీద్, 3 అబ్దుస్సలామ్, అను నాపుత్రుల యుపయోగముకొఱకును వ్రాయుటమైనది. దీనిని షీరాజ్ పట్టణ వాసులగు మహనీయులైన సాదీగారి లోకప్రసిద్ధములగు గులిస్తాఁ, బోస్తాఁ, పంద్ నామా, మొదలగు ఫార్సీ నీతిగ్రంథములనుండియు, స్మైల్సు సెల్ఫ్ హెల్ప్, థ్రిఫ్ట్, డ్యూటీ, మొదలగు నింగ్లీషు గ్రంథములనుండియు, మహాభారతము, హితోపదేశము, నీతిచంద్రిక, నీతిశాస్త్రము, భర్తృహరి, భగవద్గీత, ప్రబోధచంద్రోదయము, మొదలగుగ్రంథములనుండియు, మ. రా. కందుకూరి వీరేశలింగం పంతులుగారిచే రచియింపఁబడిన ఉపన్యాసమంజరినుండియు, ఇల్లరవుద్యానమనెడి ద్రవిడగ్రంథమునుండియు, మఱియు హిందుస్థానీ, ఫార్సీ, ఇంగ్లీషు, సంస్కృతము, తెనుఁగు, ఈభాషలలోనున్నయనేకగ్రంథములనుండియు చాలప్రయాసముతో సంగ్రహించి వ్రాయుటమైనది. ఫార్సీ,

హిందుస్థానీ శబ్దములయర్థమును తెనుఁగుభాషతోఁ దెలియఁజే యు నిఘంటువులు లేనందుచేతను, ఈ భాషలలో నీతివాక్యము లు నయితము అలంకారములతో నిండియుండుటచేతను, తత్త ద్భాషానియతశైలులు వివిధములుగానుండుటచేతను, వీటిని దె నుగించుటయందు మిగులశ్రమనొందితిని. నీతిగ్రంథములు పాఠ శాలలలోఁ జదివించుట యత్యావశ్యకమని దొరతనమువారి ము ఖ్యాభిప్రాయమైయున్నట్టు దొరతనమువారి రిజల్యూషనుల లోనును అనేక వార్తాపత్రికలలోనును జూచుటచేతను పాఠశాలలకుపయోగించునట్లు ఎల్లమతములవారికిని, ఎల్లజా తులవారికిని, అవిరుద్ధములై సర్వజనసామాన్యములుగానున్న వి ధి నిషేధములు మాత్రము ఈగ్రంథమునందుఁబ్రచురింపఁబడిన వి. పచ్చికుండపైని వ్రాసినచిత్రము చెడకుండునట్లు బాల్యద శలో విద్యార్థులకు నీతిగ్రంథములు చదివించినయెడల ఆనీతు లు మనస్సునఁజక్కగానాటి ప్రవర్తనఁజక్కజేసి సర్వవిధ ముల శ్రేయస్సును గలుగఁజేయుననుటకు సందియములేదు. ఈగ్రంథమునకు రెండవకూర్పుగావలయునంత యదృష్టముగ ల్గునెడల నాకూర్పులో ఆయాయధ్యాయములకు అనుగుణ ములగు కొన్నినీతికథలను గూడఁజేర్చుట నాయభిప్రాయము. నీతులుమొదలగు సద్విషయములు ఎందున్నను పవిత్రమైనవే కాన వానిఁబరిగ్రహించుటయు నసద్విషయములను

"తాతస్య కూపోఽయమితి బ్రువాణాః
క్షారంజలం కాపురుషాః పిబన్తి."

అను న్యాయమునఁబరిత్యజించుటయు గుణపక్షపాతులకు నియత ధర్మము.

ఈగ్రంథరచనోద్దేశము కేవలము నీతిబోధనార్థ ప్రవృ త్తమైనను ఇందువివిధగ్రంథసంచయ సంగృహీతార్థంబులు

నిండియుండుటంజేసి భాషావైశద్యమునకును శైలీవిశేషపరిజ్ఞానమునకును నుపయోగించుట యానుషంగికఫలము.

ఇంతియకాక ఈగ్రంథము భాషాంతరీకరణమార్గప్రదర్శకముగాఁ (Translation Guide) గూడనుండుటచేతపాఠశాలలకు మిక్కిలియుపయోగించును.

మ. రా. రా.

1 శ్రీపరవస్తు శ్రీనివాసభట్టనాథాచార్యులయ్యవారలుఁ గారును,

2 శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి అయ్యవారలుఁ గారును,

3 పక్కి-అప్పలనరసయ్యపట్నాయకుఁడుగారును,

ఈగ్రంథమునందలి వ్యాకరణదోషములను సవరించి నాకుసహాయులుగానున్నందున వీరియెడఁ గృతజ్ఞుఁడనై యుండెద.

లోకోపకారకరమైన నీతివాక్యరత్నాకరమను నీగ్రంథము జగదాధారుండును, సర్వనియంతయును, నయమార్గానువర్తనదక్షిణసాధుజనరక్షణకృతక్షణుండునునగు భగవంతుని యనుగ్రహమువలన సర్వజనులకును నీతిమార్గప్రదర్శకంబై వర్ధిల్లుఁగావుత.

సుబేదారు షేక్ అలీసాహెబ్ గారి పుత్రుఁడును, విశాఖపట్టణపు డిస్ట్రిక్టు ఎండ్ సెషన్సుకోర్టు ట్రాన్సులేటరును అగు
ముస్షి షేక్ మౌలా

విశాఖపట్టణము }
18 డిసెంబరు 1892 }

## నీతివాక్యరత్నాకరము.

### రెండవభాగము.

### విషయసూచిక.

---

# నీతివాక్యరత్నాకరము.



## రెండవభాగము.



### సాధారణనీతివాక్యములు.

1. నీ తప్పితములను సరిగా నాలోచించుకొందువేని నీ చెడ్డ స్వభావమును దుర్గుణములును దెలిసికొని, పాపభీతి యును వినయమును నీవు పొందవచ్చును.

2. పంచేంద్రియము లాత్మకు ద్వారములవలె నున్నవి; వాని ని జాగ్రతపెట్టనిచో దురాలోచనలును దురాశలును లోనికిఁ జొచ్చును. మంచివస్తువులుగల యిల్లు కావలిలేక తెఱచియుంచితిమేని దానిలోఁ బెక్కుదొంగతనములు జరుగునుగదా.

3. పరిశుద్ధత, శాంతము, వినయము, ఓర్పు, విధేయత, భక్తి, మర్యాద, వీని నభ్యసింపవలెను.

4. వివేకము, నీతి, మనోదార్ఢ్యము, మితభోజనము, అణఁకువ, ఓర్పు, ఇంద్రియనిగ్రహము, ఔదార్యము, మైత్రి, ఇవి సన్మార్గములు.

5. తగనిచూపు చూడక, చెడుమాటలు వినక, దుర్భాష లాడ క, చెడుపని సేయక, నీ కన్ను, చెవి, నోరు, మొదల గు నైదింద్రియముల నణఁచవలెను

6. నీ పొరుగువానిపైని కోపింపఁ గూడదు. వానితో జగడ మా డఁగూడదు. వానికిఁ గలుగు మేలునుగుఱించి దుఃఖింప

వలదు. వానికి సంభవించు కీడునుగుఱించి సంతోషింపవలదు. నిర్హేతుకముగా వానిపై ననుమానపడవలదు. వానింగూర్చి యగౌరవముగా సంభాషింపవలదు. వానిపైని కొండెములు చెప్పవలదు.

7. చెడుతలంపులను, ఆశలను, నీమనస్సునం జొరవ్వనీకుము. చెడుమాట లాడంగూడదు, వినంగూడదు. చెడుపాటలను బాడంగూడదు; వినంగూడదు. చెడుపుస్తకములు చదువంగూడదు. చెడుచూపులు చూడంగూడదు.

8. పరుల సొమ్మున కాశపడి దాని నన్యాయముగ సంపాదించుటకుం బ్రయత్నింపకుము. దొంగతనముం జేయువారికి సహాయము చేయకుము. దొంగవస్తువులను గొనకుము. వానిని నీయొద్ద దాంచకుము. అధర్మవృద్ధిని బుచ్చుకొనకుము. తగిన ప్రయత్నముం జేసి యప్పులవారి ఋణము దీర్చుము. ఇతరుల వస్తువులు నీకు దొరికినప్పు డావస్తువు లెవరివో వారిని గనుగొని యిచ్చివేయుము. నీవు చేయు నొడంబడికలను దప్పకుము. అబద్ధపుసాక్ష్యమును బలుకకుము.

9. తన్నుమాని పరులను రక్షించుట నీతి గాదు. తాను మాలిన ధర్మము, మొదలుచెడ్డ బేరము, లేదు. తాను బ్రతికి సమస్తపురుషార్థములు సంపాదించుకొనవలెను.

10. శత్రువైనను గృహమునకు వచ్చినవానిని సన్మానింపవలెను. ధనములేనియెడల మంచిమాటలతోనైనను సత్కరింపవలెను.

11. పరస్త్రీలను తమ తల్లులవలెం జూడవలెను. పరధనములను మంటిపెల్లవలెం జూడవలెను. అన్నిపదార్థములనుదనవలెనే చూడవలెను.

12. తగినటుల మాటలాడుటయు, నిజముగా మాటలాడుటయు, న్యాయముగా మాటలాడుటయు, సర్వజనులకుఁ బ్రీతి గలుగునటుల మాటలాడుటయు, శ్రేష్ఠములైన మార్గములై యున్నవి.

13. దేహమునందు విఱిగియున్న బాణములను బాధలేకుండఁ దీసి వేయవచ్చునుగాని మనస్సునందు నాటిన కఠినమైన మాటల నేయుపాయముచేతనైనను దీయుట శక్యము కాదు.

14. భయంకరమగు కత్తిచేతనయినను, గొడ్డలి చేతనయినను, దెగిన వృక్షమునందుఁ దిఱిగియు చిగురు పుట్టునుగాని, మాటల చేతఁ జెడఁగొట్టఁబడిన పనితిఱిగియు నెఱవేరఁ జాలదు.

15. మనుష్యులు స్తోత్రముచేసినను, దూషించినను, మనస్సునందుఁ బ్రీతిద్వేషములు లేకుండుటయు, కారణమున్నను గోపము పుట్టకుండుటయు, నివి శ్రేష్ఠమైన గుణములు.

16. చెడుమాటలు పడినవానిని బాపములు వదలును, చెడుమాట లాడినవానిని బాపములు చేరును. కాఁబట్టి చెడు మాట లాడి పరుల పాపములను మనము పొందుట తగదు.

17. గర్వముపడకుండుట, యాచింపకుండుట, యింద్రియవ్యాపారములయందు మిగులఁ బ్రవర్తింపకుండుట, ఇవి మంచిగుణములు. పరులను దూషించుట, తన్ను దాను బొగడికొనుట, యివి చెడ్డ గుణములు.

18. స్నేహము, సంభాషణము, బలము, వివాహము, తిరస్కరణము, ఇవి తమకు సమానులతోనే తగును. తమకంటెఁ దక్కువవారితోఁ దగవు.

తనకంటె నధికుని నెదిరించి యోడించుట మగవానికి మగఁటిమిగాని, తనకంటె నల్పుని నోడించుటవలనఁ బ్రయొజనము లేదు. అదిశూరత్వముగాదు.

20. సమానమగు మంచిస్వభావమును, నియమమును, సమానమగు ధనమును,సమానమగు మంచినడవడియును గలవారికిమాత్రమే యన్యోన్యస్నేహమును, బెండ్లియును దగునుగాని, స్నేహవివాహములు రెండు నసమానులకుఁదగవు,

21. ద్రవ్యవంతునితో బీదవానికిని, తత్వజ్ఞానితోఁ దెలివిలేని వానికిని, విశేషశాంతిగలవానితోఁ గ్రూరునకు ను, వీరునితోఁ బిఱికివానికిని, సేనగలవానితో సేనలేనివానికిని, సన్మార్గునితో దుర్మార్గునికిని, ఏవిధముచేతనైనను స్నేహ మనుకూలపడదు.

22. స్నేహితుఁ డిహమునందును 'పరమునందునుగూడ శుభములకొఱకు యత్నింపజేయునుగాన, మిత్రుఁడును ధనము నను నీరెంటిలో మిత్రుఁడే యధికుఁడని తెలిసికొనవలయును.

23. మొదట ననిష్టమైనను దుదకుమిక్కిలి న్యాయముగానుండు మాటలుస్నేహితులవిషయమై బలవంతముగనైనను మొగమోడక చెప్పవలయును. అట్టివాఁడె నిజమైన స్నేహితుఁడు.

24. పిడుగుపడుటయును, గాలివీచుటయును, మనుష్యులకుఁదెలియఁబడువిధమున, నధికకోపమును, స్నేహమునువానిప్రయోజనకాలమందు మాత్రము. స్పష్టముగాఁదెలియఁజేయవలయును.

25. నీవు క్షేమమును బొందఁగోరునెడల శ్రేష్ఠమైనవంశము.

నంమఁ బుట్టినవాఁడును, మంచిగుణములు గలవాఁడు
ను, మంచి స్నేహబుద్ధి గలవాఁడునైన స్నేహితుని
మనస్సు సంతోషించు విధముగాఁ దత్సమీపమున బ్రతు
కవలయును.

26. పరుల మేలు గోరువారు వారిని జెడునడవడులయందుఁ
బ్రవేశింపనీయక తొలఁగఁజేయుదురు. పుణ్యము తొలఁ
గి పోయినయెడలమాత్ర మాయాప్తజనము తొలఁగిపోవు
నుగాని సంపద తొలఁగిపోయినంతమాత్రమునఁదొలఁ
గిపోనేరదు.

27. తమ కార్యమునుగుఱించి ధైర్యముగల బుద్ధిమంతులతో
ముందుగా విచారణ చేయవలెను; అటులు చేసినపిమ్మ
ట నారంభింపఁబడిన పని విఘ్నములను లక్ష్యపెట్టక
తుదముట్టును.

28. తన మంచిని, చెడుగును, తాను బుద్ధివలనఁ దెలిసికొను
చు స్నేహితులు చెప్పెడు హితమును విని నడచుకొను
వాని కెల్లప్పుడును మేలే కలుగును.

29. తనమనస్సునం దెల్లప్పుడు ధర్మమును దలంచుచు, గర్వ
మునువదలి, జితేంద్రియత గలిగి ప్రవర్తించువానికి మే
లు గలుగును.

30. జ్ఞానహీనుఁడు చేయఁగూడని పనులను జేసి తుదకు వ్యస
నపడును. యథార్థమును విశేషబుద్ధిమంతుఁడుమాత్ర
మే యంగీకరించును. స్వల్పబుద్ధిగలవానికది విషము
గా నుండును.

31. బుద్ధిమంతులు కాలమునును, దేశమునును, గుఱుతెఱిఁగి త
మపనులను నెఱవేఱుచుకొందురు.

32. పచ్చికాయనుగోయఁగా రుచిచెడుటయే కాక దానియంద

లి విత్తనముగూడఁ జెడిపోవును. పక్వముకాఁగానే కోయుటవలన ఫలముగలుగుటయేకాక విత్తనముగూడఁ జెడదు. కార్యము నెఱవేఱుటయొక్కవిధ మీప్రకారముగానె యుండును.

33. పుష్పములను గట్టువాఁడు పుష్పములను గోయు విధముగానును, తుమ్మెదపూదేనెను ద్రాగువిధముగాను, నెమటివాఁడు నొవ్వకుండ కార్యములయొక్క ఫలితములను గ్రహింపవలెను. బొగ్గులవానివలె నడుగంట నఱకఁగూడదు.

34. సజ్జనులు తగిన పనిని తరుణములోనే చేయుదురు; దుష్టులట్లు చేయక, యాకార్యమును ద్వేషముచేత నిలిపియుంచి కడపట నాపదసంభవించునపుడు దూషింపఁదలఁతురు.

35. న్యాయము నతిక్రమింపక నీతిమార్గముచేతఁ బని నెఱవేఱుచుకొనుచో ఫలసిద్ధియును, నిర్దోషమైనకీర్తియును, గలుగును. ఆఫలసిద్ధికీర్తులు గలుగకపోయినను గౌరవము చెడదు. దూషణముకూడఁ గలుగదు.

36. తగిన కార్యమును న్యాయవంతులైన యాప్తులకు సమ్మతముగాఁ జేయునెడల దైవసహాయము ప్రాప్తించి పనులు నెఱవేఱును.

37. ఏమనుష్యుఁడు తనమనస్సు ధైర్యమునుబొందుచుండఁగా వెనుకఁదీయక తగినవర్తనముతో నుండునో, యట్టిమనుష్యునకు నెచ్చటనైన, నెట్టిపనియైనను, సమకూడుట కష్టము కాదు.

38. వేదమును వినుటవలన వైదికుఁ డగును. అసమానమైన తపముచేత మిక్కిలి మాహాత్మ్యమును బొందును. ధైర్య

ముచేత సహాయయుతుఁడగును. పెద్దలసేవచేయుట చేత మిగుల బుద్ధిశాలి యగును.

39. ద్రవ్యము, ఇంటిలోపలికలఁతలు, ఈవి, మర్యాద, అమర్యాద, ఇవి రహస్యముగా దాఁచఁదగినవి.

40. కొడుకును అయిదుసంవత్సరములవఱకు మనము రాజునుగాఁ జూడవలెను. అదిమొదలుకొని పదిసంవత్సరములవఱకు నౌకరునువలెఁ జూడవలెను. పదియాఱు సంవత్సరముల వయసునకుఁ దరువాత స్నేహితునిగాఁ జూడవలెను.

41. కష్టపడువానికి కఱవుకాలము లేదు; భగవంతుని ధ్యానించువానికిఁ బాపము లేదు. మౌనముగా నుండువానికి జగడము లేదు. మేలుకొని యుండువానికి భయము లేదు.

42. మనము, బండికి అయిదుమూరల దూరములోనను, గుఱ్ఱమునకుఁ బదిమూరలదూరములోనను, ఏనుఁగునకు వేయిమూరల దూరములోనను, చెడ్డవానికిఁ జాలదూరముగాను నుండవలెను.

43} చెడ్డయూరును, చెడ్డస్నేహితుఁడును, చెడురాజ్యమును, చెడుచుట్టమును, చెడుపెండ్లామును, చెడుప్రభుత్వము, ననువీనిని మనము దూరముగాఁ బరిత్యజింపవలెను.

44. సంగీతము పాడునపుడును, వాద్యము వాయించునపుడును, నాట్య మాడునపుడును, శత్రువులతో యుద్ధము చేయునపుడును, భోజనముచేయునపుడును, వ్యవహారముచేయునపుడును, సిగ్గు విడుచు మనుష్యుఁడు సుఖమును బొందును.

45. కోకిలపక్షులకుఁ గంఠధ్వనియందును, స్త్రీలకుఁ బాతివ్రత్యమందును, రూపము లేనివారికి విద్యయందును, ఋషుల

ను శాంతమునందును, సౌందర్యముండును.

46. మంచివిద్యను నీచజాతివానియొద్దనయినను శ్రద్ధతో మన ము నేర్చుకొనవచ్చును. శ్రేష్ఠమైన నీతిని చండాలునివ ల్లనైనను మనము గ్రహింపవచ్చును. సుగుణములుగల స్త్రీని, చెడ్డకుటుంబమునుండియైనను మనము వివాహ ము చేసికొనవచ్చును.

47. చెడుసహవాసమును వదలుము. మంచివారిచేరికను బొం దుము. రాత్రియందును బగటియందును సత్కార్యము లను జేయుము. అన్నివస్తువులు నశాశ్వతములని యెల్ల ప్పుడును దలంపునం దుంచుకొనుము.

## సంభాషణము.

1. అనేకులు చెప్పుమాటతప్పైనను సరియని మనుష్యులొప్పు కొందురుగాని యొకఁడుచెప్పినమాట నిజముగానుం డినను జనులొప్పుకొనరు గనుక తెలివిగలమనుష్యుఁడది దెలిసికొని యూరకుండవలెను.

2. స్నేహము, ద్వేషము, జ్ఞానము, కలఁత, పుణ్యము, పాపము, గౌరవము, లాఘవము, ఇవి మాటలవలననేవచ్చును గ నుక యుక్తముగ మాటలాడవలెను.

3. ఎదుటివారికిహితముగానును, ప్రియముగానును, చెవులకిం పుగానును, ధర్మయుక్తముగానును, సంభాషింపవల యును.

4. సౌఖ్యము, స్నేహితులు, చుట్టములు, చెఱసాల, చావు, ఇ వియన్నియు మననాలుకవలననే కలుగుచున్నవి.

## సోమరితనము.

1. యుక్తకాలములో విద్యనేర్చుకొననివారు తమజీవితకాల

మెల్ల మూఢులయి తెలివిలేకకష్టపడుదురు.

2. ఒకలేఁతచెట్టు వంగియుండునపుడు దానినతిసులభముగా నిలువఁబెట్టవచ్చును. అదియెదిగి బలపడినపైనివిఱుగును గాని తిన్నఁబడదు.

3. పురుషప్రయత్నముచేతఁ గార్యములుసిద్ధించును. వ్యర్థమైన కోరికలచేత సిద్ధింపవు. నిద్రించుచుండు సింహము నోట మృగములు దమయంతటఁ దామువచ్చి చొరఁబడవు. కావున తమపనులను సాధించుకొనుటకుఁ దగిన పాటుపడవలెను.

4. అనిత్యమైన శరీరముకంటె స్థిరమైనకీర్తి శ్రేష్ఠమైయున్నది. శరీరములకు గుణములకు మిక్కిలి భేదముగలదు. శరీరము క్షణములో నాశముఁజెందును. గుణము ప్రళయకాలమువఱకు శాశ్వతమైయుండును. కాఁబట్టి కీర్తిని సంపాదింపవలెను.

5. ధనకనక వస్తువాహనాదులలో నేవియును గాలమునుతిన్నగావినియోగపఱుచుకొననిచో న్యాయముగాలభింపవు;లభించినపుడు సయితమవి యిహలోకసౌఖ్యమునకుమాత్రమకక్కఱకువచ్చును. కాలమును తిన్నగానుపయోగించుకొన్నచో నది యిహపరసౌఖ్యములకు రెంటికింగూడఁ బరమప్రయోజనకరముగా నుండును.

6. సాధారణముగా రాత్రి పదిగంటలువేసినతోడనే పనులు చాలించి నిద్రకుఁబోయి ప్రాతఃకాలమున నైదుగంటలు వేసినతోడనే నిద్రనుండి లేచుటయెంతయు మంచిపని.

7. మితమైన నిద్రననుభవింపుచు దేహబలముగలిగి, వ్యర్థనిద్రకయి పాడు చేయుకాలములోఁ దనకును లోకమునకును బ్రయోజనకరముగానుండు కార్యములను జేయుచు

నెంతసౌఖ్యమనుభవింపవచ్చును?

8. లోకమునందుఁ బురుషప్రయత్నము పైరుపెట్టిన భూమితో సమానము; అదృష్టము విత్తనముతో సమానము; ఇట్టియదృష్టపురుషప్రయత్నము లొకటిగాఁ జేరినయెడలఁ బ్రయత్నము సేయుమనుష్యుఁడు ఫలమును బొందును. మనుష్యుఁడు ప్రయత్నము చేయనియెడలఁ గేవలమదృష్టమాత్రముచేతఁ గార్యసిద్ధిగానేరదు.

## మైత్రి.

1. ధనముగాని, సంపదకుమార్గమైన మఱియేయితరసాధనముగాని, లేనియపుడు, బుద్ధిమంతులు పరస్పరమైత్రిని సంపాదించుకొనితమకార్యములనుసాధించుకొనవలెను.
2. లోకమునందుఁ దలిదండ్రులు మిత్రుఁడు వీరు మువ్వురేహితము సేయువారు. తక్కినవారందఱును కార్యావసరమునుబట్టి హితులగుచున్నారు.
3. మిత్రలాభముకంటెగొప్పదిలోకమునందుమఱియేదియు లేదు. కాఁబట్టి బుద్ధిమంతుఁ డనేకమిత్రులను సంపాదించుకొనవలెను. ఇతరసాధనములవల్ల నెఱవేఱనిపనులు మైత్రివల్ల సులభముగా సమకూడును.
4. ప్రత్యక్షమందిచ్చకములాడి పరోక్షమందు కార్యహానిచేయు స్నేహితుఁడు పాలుముఖమునందుఁగలవిషముతో నింపఁబడియున్నకుండవంటివాఁడు, గనుక నట్టివాని స్నేహమును పరిత్యజింపవలెను.
5. సజ్జనసాంగత్యమువలన సర్వశ్రేయములవలె దుర్జనసాంగత్యమువలన సర్వానర్థములును ప్రాప్తించును.
6. సుమిత్రుఁడు తనమిత్రుని పాపపుకార్యములనుండి త్రిప్పును,

మేలైన ప్రయోజనముఁ గలిగించును; రహస్యమును దాఁచును; గుణము ప్రచురము సేయును; దుఃఖితుఁడుగానున్నప్పుడు విడువఁడు; దారిద్ర్యసమయమందు ద్రవ్యమిచ్చును; ఇవియే సన్మిత్రలక్షణంబులు. ఈ లక్షణములు లేనివానిని మిత్రునిగా భావింపఁగూడదు.

7. లోకవ్యవహారము, భీతి, సిగ్గు, దయాళుత్వము, ధర్మస్వభావము, ఈయయిదు నెవనియందు లేకుండునో వానితో సహవాసముఁ జేయఁగూడదు.

8. సత్సహవాసము సంపదను గలుగఁజేయును; కీర్తిని వృద్ధిఁబొందించును; అధికమైనసంతోషమును గలుగఁజేయును; అధికమైన పాపములనుఁబోగొట్టును; నిర్మలమైన తెలివిని గలుగఁజేయును. సజ్జనసహవాసమెల్ల ప్రయోజనములకు సాధనమైయున్నది.

9. సత్పురుషులయొక్క సహవాసము మంచిగుణము లేనివారికి మంచిగుణముఁ గలుగఁజేయును; పరిమళము లేని నువ్వులు మొదలగు పదార్థములు పుష్పములు మొదలైన పరిమళద్రవ్యములయొక్క సహవాసముచేత నేప్రకారము పరిమళముగలవియగునో యాప్రకారమే మంచిగుణములు లేనివారు మంచిగుణములు గలవారగుదురు.

10. కమ్మరివాని సమ్మెటదెబ్బ యినుముతోఁగూడిననిప్పును బాధపెట్టునట్లల్పుఁడు తనతో సహవాసముఁ జేయు నిర్దోషినిగూడ, నపఖ్యాతిని, జెఱుపును, దప్పకపొందించును.

11 దుష్టుఁడు మనకెంత నమ్మకముగలుగఁజేసినను వానిని జేరఁగూడదు. వానియొద్దఁ జేరినయెడలఁ దప్పకహానిసంభవించును. అదియేలాగుననఁగా బోనులోనున్నయెఱకాశపడి సమీపించినయెడలను పందికొక్కు చావదా?

12 ఎంతగొప్పవాఁడైన నాపదలోనుండునపుడు వివేకులయిన తన స్నేహితుల సాహాయ్యములేనిది బాగుపడనేరఁడు. నిప్పారి పోవుచున్నప్పుడు కట్టలనుబైకిఁద్రోసి యూఁద నియెడలనది మండఁజాలునా?

13 బుద్ధిమంతుఁడు దుర్మార్గుల స్వభావమును దెలిసికొనకవారి తోఁగూడఁదగదు. అట్లుగూడునెడల వారుతనపైఁబడిప రిహాసముఁజేయుదురు. కాకులుకోవిలను చూచునప్పుడు గుంపులుగూడి వికారముగా నఱచుచు నాకోకిలను దరి మితన్నును.

14 ఎల్లవిధములచేత దుష్టసంబంధమును విడువవలెను. ఒకప్పుడ గత్యమైనయెడలహద్దుమీఱకుండనుండవలెను. తమలపా కులలో సున్నముహెచ్చైన యెడల నాలుక పొక్కును గదా?

## జ్ఞానము.

1. భూమిని దున్నివిత్తనము జల్లినప్పటికినివర్షముకురియనియె డల నది ఫలింపనియాటుల మనుష్యుని ప్రయత్నమునకు దైవసహాయము లేనియెడలఁ గార్యములు సఫలములు గానేరవు.

2. పహింసగాని చేయక సమస్తప్రాణులయందు దయాళు వులై ప్రవర్తించువారికి స్వర్గము సులభమైయున్న ది. భూతదయగలవాఁడే సర్వధర్మములు చేసినవాఁ డు. కడపటఁదానుజేసిన ధర్మమే తనకు సహకారియ గును గానితక్కినదియేదియుఁ దోడరాఁబోదు.

3. ఎట్టిబుద్ధిమంతునకుఁగాని బుద్ధిహీనునకుఁగాని సుఖదుఃఖ ములననుభవింపక తీఱదు; ప్రాణులకు సుఖదుఃఖములు

సహజములు.

4. ఆయువు గట్టిగానుండెనా మహామృత్యువు వాతఁజొచ్చి యయినమఱిరావచ్చును; కాలముసమీపించెనా కోటి వేల్పులయినమరణమును మానుపఁజాలరు.

5. జాతిలోపలనున్నకప్పలను భరించు దయాస్వరూపుఁడైన యీశ్వరుఁడు మనలను గాపాడకుండునా?

6. అన్నిపదార్థములును తఱుగుటకే వృద్ధిఁబొందును; వంగుటకయిపొడవుగఁ బెఱుగును. ఎడఁబాయుటకయిదగ్గఱఁ జేరును. నాశమునొందుటకై జనించును; దుఃఖములననుభవించుటకు సుఖముఁబొందును; కాఁబట్టి పదార్థములు స్థిరములుకావు.

7. నీమాటలితరులవలన సవరణచేయఁబడనియెడల సరిగానుండనేరవు.

హితమువిననివాఁడు దూషణములపాలగును.

9. ప్రాణమశాశ్వతమైనది; గౌరవము సూర్యచంద్రాదులుండు వఱకుండునది; కాఁబట్టి ప్రాణమునువిడిచిపెట్టియైనను గౌరవమునే కాపాడుకొనవలయును.

10. మనదేహము లశాశ్వతములు; మనసంపదలుగూడ స్థిరములుగావు; యముఁడెల్లప్పుడు మనదగ్గఱనేయుండును; కాఁబట్టి మనము ధర్మమునుసంపాదింపవలెను.

11. మోహము, కోపము, అత్యాశ, అనెడియీదొంగవాండ్రు మనశరీరమునందుండు తెలివియనెడు రత్నమును దొంగిలించుటకై పాదుకొనియున్నారు; కాఁబట్టి మనము బహుజాగ్రత్తతో మేల్కొనియుండవలెను.

12. తపస్సు, వేదాంతవిచారము, ఉల్లాసస్వభావము, శరీరపారిశుద్ధ్యము, మనఃపారిశుద్ధ్యము, భగవదారాధనము,

ఇవిగొప్పయాత్మధర్మములు; ఇవిమనసునకు నిశ్చలత నుగలుగఁజేయును.

13. తానింటియందుండి యైదింద్రియములను లోఁబఱుచుకొనుటయే తనకుతపస్సుగానున్నది; చెడ్డకార్యములయందుఁబ్రవేశింపక యింద్రియములను జయించువానికిల్లే యాశ్రమమైయున్నది; కాఁబట్టి వాఁడుతపస్సునిమిత్తమై యడవికిఁజనుట నిష్ప్రయోజనము.

## విద్య.

1. మనుష్యునకు నోర్పుకవచమైయున్నది. కోపముశత్రువైయున్నది. దాయాదుఁ డగ్నియైయున్నాఁడు. మిత్రుఁడుదగినయౌషధమైయున్నాఁడు. దుర్జనులు భయంకరమైన పాములైయున్నారు. మంచివిద్యధనమైయున్నది.

2. మనుష్యుఁడు భృత్యులయందు మిగుల దయయు, స్వజనులయం దనుకూలవృత్తియు, మంచిబుద్ధిగలవారియెడలఁ బ్రీతియుఁ, దలిదండ్రులయెడల సైరణయుఁ, బండితులయెడలగౌరవమును, రాజులయెడలవినయమును, స్త్రీలయెడలఁబ్రౌఢత్వమును, గలిగియుండవలెను.

3. పిల్లలు తమతలిదండ్రులు చెప్పినట్లువిని చదువుకొని లోకులచేత మంచివారనిపించుకొనవలెను; మూర్ఖుఁడెల్లప్పుడును తలిదండ్రులకు దుఃఖముఁబుట్టించుచున్నాఁడు. అట్టివాఁడు చచ్చెనేనిఁదలిదండ్రులకు దుఃఖముదీరును. కులమునకుఁగీర్తిఁదెచ్చినవాఁడు పుత్రుఁడు. తక్కినవాఁడు దల్లికడుపుఁజెఱుపఁబుట్టినవాఁడు. గుణవంతుఁడైన పుత్రుఁడొకఁడుచాలును. మూర్ఖులు నూఱువురవలన ఫలమేమి? తలిదండ్రులకు విద్యావంతులై గుణవంతులై

న పుత్రులనుజూచి సంతోషించుటకంటె వేఱొకసం పదగలదా?

4. బుద్ధిమంతుఁడు జరామరణములు లేనివానివలెవిద్యాధనము లు గణింపవలెను. ధనార్జనమునకు సాధనములనేక ములుగలవు. వానిలోవాణిజ్యమన్నివిధముల మేలైనది.

5. బహుదేశాటనంబును, దెలిసినవారితోడ నిరంతరసాంగ త్యంబును, కావ్యశాస్త్రవిచారంబును, రాజాస్థానంబు ల బహుకాలసేవనంబును, బురుషునకెట్టివానికేని వివే కంబు పుట్టింపసమర్థంబులై యుండును.

6. ఎంతమంచివస్తువునైనను క్రమముగ నుపయోగించుకొనని యెడల ననేకనష్టములును దుఃఖములును గలుగును. మ నకుఁ బ్రాణాధారమైన యాహారమును సయితము మిత ముతప్పి భుజించునెడల ననేకరోగములు సంభవిం చును.

7. విద్యలేనివాఁడు తనయింటియందును, ప్రభువుతనయూరి యందును, రాజుతనరాజ్యమునందును, గొప్పగా నెం చఁబడుదురు. పండితుఁడుమాత్ర మన్నిదేశములయం దును, గొప్పగానెంచఁబడును.

8. కాన్పుబాధను గొడ్రాలు తెలిసికొనలేనియట్లు పండితునికష్టము పామరుఁడు దెలిసికొనఁజాలడు.

9. ఎంతవిద్యావంతుఁడైనను స్వారస్యమును దెలిసికొనుసామ ర్థ్యముగలిగియుండనియెడల నావిద్యయంతయు నిష్ప్ర యోజనము. అట్టివానియందుండు నితరగుణసంపదల నెవ్వరును మెచ్చరు. ఎంతఘనముగాఁబక్వము సేయఁ బడినకూరయైన నుప్పుమాత్రము లేకపోయినయెడల రు చిగానుండునా?

10. విద్యలేనివారు, సౌందర్యమును ప్రాయమును కలిగియుండి, గొప్పవంశమునందుఁ బుట్టినవారైనప్పటికిని, వాసనలేని యెఱ్ఱమోదుగ పువ్వువలెఁ బ్రకాశింపరు.

11. చుట్టములు, స్నేహితులు, ఇంక మనకునింటియొద్ద ప్రీతిగల వి గానున్నవన్నియును మనను విడిచిపెట్టిపోవును. విద్య మాత్రము మననెప్పటికిని విడిచిపెట్టిపోదు.

---

## సుజనపద్ధతి.

1. ఆఁకలిఁగొనినవారల కన్నము పెట్టవలెను. దాహముగలిగిన వారికి దాహశాంతి చేయవలెను. చనిపోయినవారిని మతాచారరీతిని భూస్థాపనముగాని దహనముగాని చేయవలెను. దుఃఖపడువారల కుపశమనముఁ జేయవలెను.

2. ఐకమత్యముచేత నెంతకఠినపుపనియయినను సాధింపవచ్చును. గడ్డిపరకలుసయితము త్రాడుగాఁ బేనఁబడినయెడల, మదపుటేనుఁగును దాని చేఁ గట్టవచ్చును.

3. సజ్జనులు శ్రేష్ఠులైనపుణ్యాత్ముల యొక్క గోష్ఠిఁగోరుదురు; ఇతరులసుగుణములనుజూచి సంతోషింతురు; తమగురువులను సన్మానింతురు; విద్యయందభిరుచిగలిగియుందురు; లోకనిందకు భయపడుదురు; భగవంతునియందుభక్తిగలిగి యుందురు; తమ్ముఁదామెంచుకొందురు; ఇంద్రియనిగ్రహముగలవారై యుందురు; సత్పురుషులను దూషించువారి సాంగత్యమును బరిత్యజింతురు.

4. సజ్జనులకాపదలందు ధైర్యగుణమును, సంపదగలిగియున్నప్పుడోర్పును, రాజులసభలయందు మాటలచాతుర్యమును, కీర్తియందాసక్తియును, విద్యయందుఁగోరికయును, సహజములైయున్నవి.

5. దానము, యథార్థముగాఁబలుకుట, తమతల్లిదండ్రుల యొక్కయు, గురువులయొక్కయుఁ, బాదములకునమ స్కారములుసేయుట, బలము, హృదయమందు స్వ చ్ఛమైననడవడి, విద్య, ఇవి గొప్పదశయందును, వేద టికమునందును, మనుష్యునకాభరణములైయున్నవి.

6. పరులను హింసింపకుండుట, పరులసొమ్మునపహరింపకుండు ట, సత్యమునందుఁబ్రీతిగలిగియుండుట, దానముచేయు టయందాసక్తిగలిగియుండుట, పరస్త్రీలను గుఱించి సంభాషణములనుజేయకుండ మూఁగతనమునువహించి యుండుట, ఇతరులకోరికలనుదీర్చుట, తలిదండ్రులు మొదలైన పెద్దలయెడల నడఁకువగానుండుట, జంతువు లయెడల దయగలిగియుండుట, మతనీతిశాస్త్రములన భ్యసించి వానిప్రకారము యుక్తముగాఁబ్రవర్తించుట, ఇవి మేలుపొందుటకు ఘనమైనమార్గములైయున్నవి.

7. గొప్పవారిహృదయము సంపదగలిగినప్పుడు కలువపూవువ లె మెత్తగానుండును; ఆపదసంభవించునపుడు పర్వత మువలె కఠినముగానుండును.

8. నీతిప్రవర్తనమును, మహాకష్టదశయందుసయితము పాపక ర్మమును జేయకపోవుటయు, దుర్జనులను యాచించక కుండుటయు, దారిద్ర్యకాలమందును గోరికలులేకుండు టయు, దుఃఖమునుబొందియున్నప్పుడును ధైర్యముతప్ప కుండుటయు, పండితులతో నత్యంతానుకూలముగానుం డుటయు, ననునీగుణములు సజ్జనులకు స్వభావసిద్ధము లైయుండును.

9. యాచకుఁడు తనయింటికివచ్చినపుడు సంతోషముతో ర హస్యముగానతనికిదానముసేయుటయుఁ, దానుజేయు

నుపకారము నితరులతోఁ జెప్పకుండుటయు, మిత్రులు తమకుఁ జేయునుపకారములను రాజసభలయందుఁ బ్రచురము చేయుటయు, నిందార్హములగుపనులలోఁ బ్రవర్తింపకుండుటయు, ననునివిసజ్జనులకుఁ బ్రకృతిసిద్ధములై యున్నవి.

10. అధమునిఁ గొల్చువారియొక్క పౌరుషవృత్తి, కాల్చఁబడిన యినుమునందు పేరులేకుండనశించిన నీటివలెనుండును; మధ్యమునిఁ గొల్చువారియొక్క పౌరుషవృత్తి తామరాకునందు ముత్యమువలెఁ బ్రకాశించు నీటివలెనుండును. ఉత్తమునిఁ గొల్చువారియొక్క పౌరుషవృత్తి, ముత్తెపుచిప్పలోఁ బడికాంతితో రత్నభావమును బొందిన నీటివలెనుండును.

11. ఎవ్వఁడు దనతండ్రిని సత్కారములచేత మిక్కిలిసంతుష్టునిగాఁ జేయునో, యతఁడేసుతుఁడు. ఏస్త్రీతనభర్తయాజ్ఞకులోఁబడి నడుచుకొనునో, యామెయేమంచి భార్య. ఏమనుష్యుఁడాపదయందును, సంపదయందును, సమానమైననడవడి గలవాఁడో యతఁడేహితుఁడు. ఈమూడును గొప్పపుణ్యము చేసినవారికే లభించును.

12. అతినమ్రతవల్ల మిక్కిలి యౌన్నత్యముఁ జెందినవారును, ఇతరులయొక్క సుగుణములను బ్రచురముఁ జేయుటచేతఁ దమగుణాధిక్యమును బ్రసిద్ధపఱుచుకొనువారును, అన్యులకోరికలను దమసామర్థ్యముచేత నెఱవేఱుచుటవలనఁ దమమనోభీష్టమును దీర్చుకొనువారును, కఠినముగా మాటలాడువారలనోరిమితోఁ దిరస్కరించువారును, అందఱిచేతను సన్మానింపఁబడఁదగినవారై యున్నారు.

13. చెట్లధికమైన రసముగలపండ్లభారమును వహించివంగియుండును; మేఘములాకాశమునందల్లాడుచు జలమునిచ్చును. ఈప్రకారముగానే సత్పురుషులు కలిమిచేత గర్వితులుగాక పరోపకారములనే చేయుచుందురు.

14. చెవి శాస్త్రములయొక్క వినికిచేతను రాణించునుగాని కుండలములుధరించుటచేత రాణించనేరదు. హస్తము దానముచేతఁ బ్రకాశించునుగాని కంకణములు ధరించుటచేతఁ బ్రకాశించనేరదు. దయగలవారిశరీరము పరులకుపకారము చేయుటచేత రాణించునుగాని గంధము పూసికొనుటచేతఁ బ్రకాశింపనేరదు.

15. పరులవలన యాచింపఁబడకుండ సూర్యుఁడు తామరపువ్వులను వికసింపఁజేయును. చంద్రుఁడు కలువపువ్వులను వికసింపఁజేయును. మేఘుఁడు జలమునిచ్చును. ఈప్రకారమె సత్పురుషులు తమంతటఁదామేయన్యులకుపకారముఁ జేయఁబూనుకొందురు.

16. ఉత్తములుతమకార్యములను సయితము విడిచిపెట్టియన్యులకు మేలుసేయుదురు. మధ్యములు తమకార్యము నెఱవేఱుచుకొనుచుఁ బరులకు మేలుసేయుదురు. అధములు తమలాభముకొఱకు పెఱవారలకార్యములను జెఱచి యపకారముఁ జేయుదురు. అధమాధములువ్యర్థముగా నొరులకుహానింజేయుదురు.

17. లోకోపకారులైనవారే సార్థకజన్ములయియున్నారు. అట్లుకానివారు నిరర్థకజన్ములయియున్నారు.

18. దురాశనువిడుచుటయు, సైరణసేయుటయు, గర్వమునువదలుటయు, దుష్టమయిన పాపాసక్తిలేకుండనుండుటయు, యథార్థముగానుండుటయుఁ, బెద్దలయభిప్రా

యములననుసరించి ప్రవర్తించుటయు, సజ్జనులను సేవించుటయు, నిర్మలత్వముగలిగియుండుటయు, శత్రువులనుసయితము దయతోఁ జూచుటయుఁ, బూజ్యులయెడలననురాగముగలిగియుండుటయు, వినయమును సంపదనుఁ బొందియుండుటయు, బీదలయందు దయగలిగియుండుటయు, నివి యోగ్యధర్మములని యెఱుఁగవలెను.

19 ప్రజలకుపకారములు సేయునట్టియు, సజ్జనులమంచిగుణములను బ్రశంసించునట్టియు, అసూయాహంకారములను విడుచునట్టియు, సత్పురుషు లీప్రపంచమునందరుదుగనుందురు.

20. శ్రేష్ఠమైన బంగారము మిక్కిలి తక్కువవిలువగల కంచువలె శబ్దము లేకుండునట్టుల యోగ్యుఁడణగియుండును గానియల్పునివలె నూరక లేనిపోనిమాటలు చెప్పఁడు.

21. పురుషుఁడు కఠోరములైనమాటలను వచింపకుండుటచేతనును, పాపపుపనులను విసర్జించుటచేతనును, సకలస్థలములయందు నుత్తముఁడని ప్రసిద్ధిఁ జెందును.

22. లోకులు తన్నుఁబొగడఁగా దానినివిని తానుసంతోషింపక పరులకు మేలుగలుగఁజేయుచుఁ గీడుసేయనివాఁడు సత్పురుషుఁడు.

23. తనమాటసాగుచున్నప్పుడు స్వైరణచేసి తానుబీదవాఁడైనప్పటికినిదనకుఁగలిగినదానిలో యాచకులకుఁ బ్రీతితోనిచ్చువాఁడు పుణ్యపురుషుఁడైయున్నాఁడు.

24. జనులకుసమ్మతమైననడతనడుచుచు, నింద్యములైన చెడుపనులుసేయక, యితరులయొక్క మేలుగోరుచు, నందఱికినినుకూలముగా బ్రదుకునదే బ్రదుకనియెఱుఁగవలయు.

25. తగినవేషము, ఆత్మస్తుతిఁ జేసికొనమి, తానుబాధఁ జెందినప్పు

టికి నితరులను దూషింపకుండమి, ధర్మముఁ జేసిన త
రువాత నిచ్చితినని చింతించకుండుటయు, కష్టకాలమం
దైనఁ గులాచారముఁ దప్పకుండుటయు, క్షేమకరములు.

26. పరులు తనమీఁదఁ గోపించినను దాను గోపింపక, తనవిషయమై కీడుమాటలను వచించినను దాను విననివానివలె బదులుమాటలను జెప్పక తా నవమానముఁ బొందినప్పటికిని దానిని మనస్సునందుంచని పురుషుఁడు జ్ఞానవంతుఁడు.

27. జీవహింస చేయకుండుటయు, యథార్థముగా మాటలాడుటయు, ఇంద్రియనిగ్రహమును, దయయు, ఇవియే గొప్పతపస్సైయున్నవి.

28. సముద్రుఁడు సర్వశ్రేష్ఠవస్తువులకు స్థానభూతుఁడైనందున నన్నినదులు నాసముద్రమునే చేరునట్లు, సంపదగలవానియొద్దకే సకలజనులు నెంతదూరముననుండియైనను వచ్చి చేరుదురు.

29. బంధువులకు లేమిసంభవించునప్పుడు ప్రేమతో వారిని గాపాడుట మంచిస్థితిలోనున్నవారికి విధి. ఈప్రకారమే యొకప్పుడోడలలో బండ్లును, బండ్లలో నోడలును వచ్చుచుండుట మనము చూచుచున్నాము గదా.

30. గొప్పగుణములు గలవాఁడితరులు దనకపకారముఁ జేసిన వారికిఁ దానుపకారమె చేయును గాని చెఱుపుఁ జేయనేరఁడు. కవ్వముతో నధికముగాఁ ద్రచ్చ నారంభించిన యెడల నాత్రచ్చఁబడిన పెఱుగు వెన్ననీయదా?

31. వంశము నందెక్కడనో యొకచోట ధర్మగుణసంపన్నుఁడొక్కఁడే పుట్టును గాని యధికముగఁ బుట్టరు. గోడుగున కుపయోగించు పుల్ల యెక్కడనో యొక్కచెట్టున దొరుకును గాని యన్ని చెట్లయందు దొరకనేరదు.

32. సజ్జనుఁడు లోకోపకారమైన పనియెంతకఠినమైనదైనను బు ణ్యముకొఱకుఁ జేయును.

33. పరోపకారియైన దాత తానితరులకిచ్చుటకుఁ దనయొద్దధన ము లేకపోయినను మఱియొకనియొద్దఁదెచ్చియేని ఇచ్చు టకుఁబ్రయత్నముఁ జేయును. మేఘుఁడు సముద్రమున కుఁబోయి యుదకమునతీసికొనివచ్చి సమస్తప్రాణుల కునిచ్చి సంరక్షింపలేదా?

34. ఉత్తముఁ డొకపని లోకోపకారముగా నుండునెడల దాని సాధించుటకెంత కష్టపడియైనను బ్రయత్నము చేసి నెఱ వేఱుచును.

35. యోగ్యునిసంభాషణము సాధారణముగాఁ బ్రీతికరమై యే యుండును. ఒకప్పుడు కఠినముగామాటలాడినను హా నికరముగాదు. వానగురియుచల్లని మేఘుమొకప్పుడు వ డగండ్లుగురిసిన నవిచల్లనినీళ్లేయగునుగాని జాళ్లగునా?

36. మంచిగుణములుగలవానికి రూపు, సంపదలు, లేకపోయిన ప్పటికిని బుద్ధిమంతులతనిని గొప్పగానెంచుదురు. ఖర్జూ రపుకాయపైకిఁ గఱుకుగానున్నప్పటికిని లోనిమాధుర్య మునుబట్టిప్రజలుసంతోషపూర్వకముగా దానిఁగైకొం దురు.

37. మానవంతుఁడితరులు తన్నవమానపఱిచినయెడలఁ దనప్రా ణములైనవిడిచిపెట్టునుగాని యవమానమునకోర్వఁజా లఁడు.

38. ఎడతెగనిపుణ్యముచేయువానికి సంపదతొలగినను తిరిగి ల భ్యమవును. మాసాంతమునందుఁజంద్రునకుఁ గళలన్ని యుఁబోయినప్పటికిని తిరిగి సంపూర్ణముగాఁబ్రకాశిం చలేదా.

39. సుగుణసంపన్నుఁడైనవానికొకతప్పుడు చెడుగుణములుక లిగినను తగదని యితరులుచెప్పినయెడల వానినివిడిచిపె ట్టును. నీటియందుకొంచెముబురదయున్నప్పుడు చిల్లగిం జను (ఇండుపుగింజను) రాసినట్టయిన నీరంతయుఁదే టగానుండదా?

40. దయారసముగలమనుష్యుఁడు మిగుల బాధపడియుండినను లోకులతనియొద్దకుఁజేరుదురు. గానుగాడినపిమ్మట పా రవేయఁబడినచెరకుపిప్పిని సంతోషముతోఁ జీమలు చే రవా?

41. నదులునీళ్లను తాముత్రాగవు. చెట్లుతమతియ్యనిపండ్లను తా ముతినవు. మేఘములుతమవలనఫలించిన ధాన్యము లను తామనుభవింపవు. కాఁబట్టి మంచివారి సంపద లితరులకుఁ బ్రయోజనకారిగానున్నవి.

42. ఈవి, మంచిమాటలాడుట, ధైర్యము, మంచిచెడుగులను తెలిసికొనెడి తెలివి, ఈనాలుగును మనతోఁగూడఁబుట్టు గుణములేకాని నేర్చుకొనుటచేతఁగలుగునవికావు.

43. నిజము, ఈవి, ఓపిక, మంచిస్వభావము, క్రూరకార్యము లుచేయకుండుట, తపస్సు, దయ, ఈగుణములెవనియందుం డునో యతఁడే బ్రాహ్మణుఁడని ధర్మశాస్త్రము చెప్పుచున్నది.

44. సంతోషకరమైన ముఖమును, పరిశుద్ధములైనచూపులును, మంచిచరిత్రములను వినుటయందభిరుచియును, మధుర మైనమాటలును, ఎల్లప్పుడును స్నేహితులనుమిక్కిలి యానందముతోఁ జూచుటయును, ఇవి రసికుఁడైనవా నికి గురుతులు.

45. ఈలోకమందు భూదానముకంటె నధికమైనదానముకనఁ

బడను; అన్నదానము దానితోఁదుల్యముగా నుండవచ్చును; ఇతరులకు ధర్మార్థముగా విద్యనేర్పుటయింతకంటె హెచ్చైనదానము.

45. జంతువులయెడల క్రౌర్యము లేకుండుటయు, నిజము చెప్పుటయు, ఇతరులద్రవ్యముల నపహరించకుండుటయు, దానముపుచ్చుకొనకుండుటయు, ఇవిగొప్పయాత్మగుణములు. ఇవి జనులయొక్క మనస్సును నిర్మలముఁజేయుచున్నవి.

దుర్జనపద్ధతి.

1. భోజనప్రియత, మాత్సర్యము, సోమరితనము, అహంకారము, కోపము, లోభము, మోహము, ఇవిదుర్గుణములు.
2. అనేకులు తాముధనవంతులగుటకు మితిలేని యన్యాయములు, కపటములు, పాపములు, అబద్ధములైన వ్యవహారములు, ఇవి చేయుచున్నారు. దప్పిగలవాఁడు సముద్రజల మెంతత్రావినను దప్పితగ్గక యధికబాధఁబడును.
3. గుణదోషములు విచారించి వీఁడుపూజ్యుఁడు వీఁడపూజ్యుఁడని నిర్ణయింపవలెనుగాని జాతిమాత్రముచేత నిర్ణయింపఁగూడదు.
4. పరులకు నేనుకీడు సేయఁబోను, వారునాకొకకీడు సేయఁబోరని నమ్మరాదు. మంచివారికిసహితము దుష్టులవలన భయముగలదు.
5. నిర్హేతుకమైనజగడంబును, గరుణలేకపోవుటయుఁ, బరస్త్రీలయందుఁ బరధనములయందుఁగోరికయును, జుట్టములయందు సజ్జనులయందు నసూయయు, ననునీగుణములు ప్రపంచమునందు దుర్జనునకు స్వభావసిద్ధము

లయియున్నవి.

6. ఘనమైన మాణిక్యముగలిగియున్న పామును మన మెట్లువిస
ర్జింతుమో యాప్రకారమే విద్యచేతనలంకరింపఁబ
డిన దుర్జనునిసయితము మనము విసర్జింపవలెను.

7. దుర్జనుఁడు, బిడియముగలమనుష్యుని మూఢునిగాను,
మంచినిష్ఠాపరుని మోసగానిఁగాను, శుచిగానుండు
వానిఁగపటినిగాను, శూరునిదయలేనివానిఁగాను,
జ్ఞానినిబుద్ధిలేనివానిగాను, శ్రోత్రప్రియునిననఁగాఁజె
వులకింపుగ మాటలాడువాని నప్రయోజకునిఁగాను,
బలవంతునిగర్వినిగాను, జక్కఁగమాటలాడువానిని
వదరుబోతునుగాను, నెంచును. మఱియు సజ్జనునియొ
క్క సుగుణములను దుర్గుణములనుగా నెన్నుచుండును.

8. ధనమునందత్యాశగలిగియుండుటకంటె దుర్గుణంబు వేఱు
లేదు; కొండెములుచెప్పుటకంటెఁ బాపము వేఱొకటి
లేదు; సత్యవాక్కును మించినతపస్సు లేదు; మనస్సుప
రిశుద్ధముగానుండుటకంటె తీర్థసేవ లేదు; సౌజన్యము
కంటె హెచ్చైనపరివారము లేదు; సత్ప్రాజ్యతయనఁ
గా పరువుకంటెఁ బ్రకాశమానమైన యలంకారము లే
దు; విద్యకంటెవిలువగలధన మేదియును లేదు; లోకనిం
దకంటెనీచమైనచావుమఱి లేదు.

9. ప్రభువులయొద్ద భృత్యుఁడు మౌనముగానుండునెడల మూఁ
గవాఁడనియు, మంచివక్తగానుండునెడల నధికప్రసంగి
యనియు, సమీపమందుండునెడల గర్వితుఁడనియు,
దూరముగానుండునెడల భయముగలవాఁడనియు, స
హనముగలిగియుండునెడలఁ బిఱికియనియు, నభిమాన
వంతుఁడు గాననఁగాఁదనగౌరవమును గాపాడుకొను

వాఁడుగా నుండు నెడలఁదాలిమి లేనిబంటనియు, నూ హింతురు గనుక ప్రభువులయొక్క సేవ, మునులకైనన సాధ్యమైయున్నది.

10. దుష్టులకధికారమిచ్చునట్టియు, నిరంకుశముగాఁ బ్రవర్తించునట్టియు, నెల్లప్పుడుసుగుణములకు శత్రువైనట్టియు, విధివశము చేత సంపదనుబొంది గర్వించునట్టియు, దుర్మార్గ ప్రభువులను సేవించుట యెట్టివారికిని మేలుగలుగఁ జేయనేరదు.

11. చెడ్డవారియొక్క మైత్రి యారంభమందు మిక్కిలి విశేషముగానును, పిమ్మటఁదక్కువగానునుండును. సజ్జనుల మైత్రి మొదటకొంచెముగానును, తరువాత నధికముగానునుండును.

12. భూమియందితరులకు శ్రమముగలుగఁ జేయక గడ్డితినిజీవించునట్టి జింకలకు వేఁటకాండ్రును, ఉదకము చేత జీవించునట్టిచేపలకుజాలరులును, సంతోషముగా జీవించునట్టి సజ్జనులకు దోషారోపకులును, కారణము లేని శత్రువులైయున్నారు.

13. తామరరేకులవంటి ముఖవర్చస్సును, చందనమువలె చల్లనైనమాటలును, కత్తెరతో సమానమగు తీక్ష్ణమైనహృదయమును, విశేషనమ్రతయును, మోసగాని లక్షణములు.

14. పరులతప్పులను బయలుపఱుచుటకందఱును సమర్థులే కానితమతప్పులను దెలిసికొనునట్టి వివేకులెవ్వరునుగా నరారు.

15. బీదలకివ్వక భాగ్యవంతులకిచ్చువాఁడు లోకులుదన్నుమెచ్చుకొనవలెనని తలఁచువాఁడే కానిపరులకుపకారముఁ

జేయువాఁడుకాఁడు.

16. పాముపడగనీడను జేరినకప్పయెట్లుబాధింపఁబడునో, యట్లె
ల్లపుడునుదప్పులే వెదకుచుండు యజమానునియొద్దఁ గొ
లుచువాఁడు దప్పకబాధఁజెందును.

17. కుక్కకుదొరతనమిచ్చి బంగారుగద్దెపైఁగూర్చుండఁ బెట్టిన
నది దననీచగుణమును విడువకుండునట్లు నీచునకు గొప్ప
దశవచ్చినను దనయల్పగుణమును విడువఁడు.

18. పామునకుఁదలయందును, తేలునకుఁదోకయందును విష
ముండును; దుష్టునికట్టినియమములేక దేహమందంతట
విషమువ్యాపించి యుండును. కాఁబట్టి దుష్టుఁడు సర్ప
వృశ్చికములకంటెఁ గ్రూరుఁడు.

19. బలిష్ఠుఁడనని గర్వపడి యందఱితోవిరోధపడు మనుష్యుఁడు
మిక్కిలియల్పములగు చలిచీమలవలనఁబొలియు, బలము
గలసర్పమువలె నశించును.

20. సరియైనయెత్తు బంగరుఁగలిపికరఁగించి పోసినప్పటికి నిత్తడి
బంగరు గానియటుల నీచునికెంతబోధించినను సహజ
మైనయల్పగుణము విడువఁడు.

21. కోపము, ఓర్వలేనితనము, గర్వము, అతృప్తి, దురభిమా
నము, నిర్వ్యాపారము, ఇవియల్పునిగుణములై యున్నవి.

22. పరుఁఘనమును, విద్యాతిశయమును, శక్తిని, ప్రతాపమును
జూచి యోర్వలేనివాఁడు రోగములేని పరితాపమును
బొందును.

23. ఎవఁడు తనకుజరిగియుండియుఁ దనతలిదండ్రులకు ధనము
మొదలైన వానినివ్వకయుండునో యట్టిమనుష్యుఁ
డు పిమ్మటఁదనమాంసమును దానేభక్షించువాఁడుగానె
న్నఁబడును. ఎవఁడు దనతల్లిదండ్రులనును, భార్యమొద

త్రైనవారినినిరక్షింపఁడో, వాఁడు బ్రతికియుండియుఁజచ్చినవానితో సమానుఁడగును.

24. అవయవహీనుని, పేదవానిని, చదువురానివానిని, సౌందర్యము లేనివానిని నిందించుట పాపము.

25. మనుష్యుఁడు ధనబలాతిశయమువలన యోగ్యులకపకారముఁ జేయునెడలఁ దనకు నాశమే కలుగును; హిరణ్యకశిపుఁడనురాక్షసుఁడు సుగుణసంపన్నుఁడైన ప్రహ్లాదునకుఁగీడుఁజేసి నాశమునుబొందలేదా?

26. పెట్టెలోనుండు గొప్ప వెలగలచీరెలను నిష్ప్రయోజనముగాఁజిమ్మటపురుగులు కొట్టికిపాడుచేయునట్లు సజ్జనుఁడు దూరముగాఁదొలఁగియుండినను దుర్మార్గుఁడో ర్వఁజాలకనిష్కారణముగా వానికపకారమేచేయును.

27. నీవొకనిహింసించుదినముకంటె దానిప్రతిఫలమును నీవనుభవించవలసినదినము మిక్కిలికఠినముగానుండును.

28. పుష్పములతోను, పండ్లతోను, నిండియుండుచెట్లను చీడపురుగు కొరికిపాడుచేయునేగాని చేరెడునీళ్లుపోసి యొకచెట్టునైనను బెంచఁజాలదు. ఈప్రకారమే దుర్జనుఁడితరులకుఁ జెఱుపునేచేయునుగాని కొంచెమైనను మేలుసేయలేఁడు.

29. మడ్డిమనుష్యుఁడుదొడ్డగుణములుగలవానితో నెంతకాలము సహవాసముఁజేసిన నతని మంచిగుణములను గ్రహింపఁజాలఁడు.

30. ఈఁగకసహ్యకరమైన చీముతోఁగూడినవ్రణముపైనుండుట యందేయిష్టముగాని నిర్మలమైన కస్తూరిపైనుండుట యందిష్టముండదు. ఈప్రకారమే యయోగ్యుఁడు మఱియొకయయోగ్యునితోనే సహవాసము చేయునుగాని

యోగ్యునితో సహవాసము చేయుటయందెంతమాత్ర
ము నిష్టపడఁడు.

31. క్రూరమైనమనస్సుగల యజమానుని సేవించు యోగ్యుల
కుఁగూడనాక్రూరగుణమే పట్టుబడి చెడుప్రవర్తన మ
భ్యాసమగును. గోదావరి మొదలైన గొప్పనదులు సము
ద్రములోఁగలిసినమాత్రమున వానికిముందున్న మాధు
ర్యాదిగుణములు చెడి యుప్పదనమే తప్పకకలుగును
గదా.

32. తాను జేయుదుర్మార్గత యెంతనేర్పుతోదాఁచి యుంచిననది
బయలుపడకమానదు. రాగిమీఁదఁబూయఁబడిన బంగా
రపునీరు చెదరిపోవునప్పుడు క్రమక్రమముగా రాగిబయ
లుపడదా?

33. పాముకుఁ బాలుపోసినచోదానివిషము వృద్ధిబొందున
ట్లు, దుర్జనునకు మేలుసేయునెడల దుర్గుణములే పెఱిగి
కీడుసంభవించును.

34. నీచుఁడు గొప్పవారినినిందించునెడలఁ దాను జేయఁబూనుప
నులు చెడఁగొట్టుకొనుటయేకాక, నిరర్థకమైనతప్పును జెం
ది, తనప్రాణమునుగూడఁబోఁగొట్టుకొనును.

35. ఇతరుల మేలు గోరనిబుద్ధిహీనుఁడు సంపదయందును దారి
ద్ర్యదశయందు నేకరీతిగానే యుండును. గుడ్డివాఁడ
ర్ధరాత్రియందును బట్టపగటియందును నేకరీతిగా నేయుం
డును గాని, వానికి నొకదానివలన నష్టమును మఱియొక
దానివలనఁబుష్టియును లేదుగదా.

36. అల్పుఁడు మర్యాద విచారించకుండఁ గఠినమైన మాటలేప
లుకును. గుణపూర్ణుఁడైన బుద్ధిమంతుఁడట్లెంతమాత్రము
నుబలుకఁడు. నీళ్లు తక్కువగానున్న కుండతొణుకును

గాని నిండుకుండ తొణుకునా?

37. పాపపునడవడి గలవాఁడు ప్రకాశవంతుఁడుగాఁగనఁబడిన ప్పటికిని దనలోపలనుండు చెడుగుణములు పోనేరవు గనుక నట్టివానినినమ్మఁగూడదు. పాపటికాయ, పైకెను న్నసికాంతిగలదై యున్నప్పటికిని, దానిలోనుండు విరోధపు చేఁ దెన్నివిధములనైనఁ బోనేరదు.

38. తెలివిలేనివాఁడు మంచితెలివిగలవారితోనుండినప్పటికిని వారినడవడిపట్టుబడదు. ఒకసరస్సులోపల హంసలతో నుండుకొంగ కాహంసలనడక లేలాగునఁగలుగును.

39. ఇతరులను నిందించువాఁడు, చేయవలసినపనులను చేయ కుండువాఁడు, నీచబుద్ధిగలవాఁడు, దీర్ఘకోపి, వీరున లుగురును నీచులు.

40. తేలునకుఁ దోకయందును, ఈఁగకుఁదలయందును, పామున కుఁగోరలయందును, దుర్మార్గునకు సర్వశరీరమునం దును, విషముండును.

41. వ్యాకులపడుచు దానముచేయుట, మునుచేసినమేలును మఱచుట, దుఃఖస్వభావము, చెడుప్రవర్తనము గల వారినిఁబొగడుచుండుట, ఇవి దుస్స్వభావముగల మను ష్యునికి గుఱుతులై యున్నవి.

42. దివ్యజ్ఞానము, నిజము, తపస్సు, మంచిప్రవర్తనము, బుద్ధి, ధనము, గొప్పతనము, ఈగుణములన్నియును స్త్రీలోలు ని విడిచిపెట్టి పోవును.

---

## వైరాగ్యము.

1. హంసములను, శుకములను, మయూరములను, నానావర్ణ ములుకలవానిగా సృజించినయీశ్వరుఁడే వానికిఁదగి

నవృత్తి కల్పించెను.

2. మనకు సత్యమైన జ్ఞానమును ప్రసాదించుటకును సన్మార్గమునందే ప్రవర్తింపబుద్ధిఁ బుట్టించుటకును నిరంతరమును సర్వకారుణికుఁడైన యీశ్వరుఁ బ్రార్థింపవలయును.

3. ఎంతటివారు మనకు సహాయము చేసినను, భగవంతుఁడు నియమించిన కాలముననే మనపనులు నెఱవేఱును.

4. కుండలయొక్క ఆకారములు వేలు వేలుగానున్నప్పటికిని మన్నొక్కటే. నగలనేకములైనప్పటికిని బంగారమొక్కటే. అనేక గోవులవలనఁ గలిగినప్పటికిని పాలొక్కటే. నానాశరీరములందుండినప్పటికిని దేవుఁడొక్కఁడే.

5. చనిపోయినవానిని ధనము గృహమందే విడిచిపెట్టును; స్నేహితులును చుట్టములును కాటియందు విడిచిపెట్టిపోవుదురు. అయితే వాఁడు చేసిన మంచిపనులును, చెడ్డపనులును మాత్రము, వాని వెంట వెళ్లును.

6. లోకమునందు మన బ్రతుకు నిశ్చయము గాదు; మనవయః కాలమును, ద్రవ్యమును, శాశ్వతములు గావు; ఆలు, బిడ్డలు మొదలైనవారు శాశ్వతముగానుండరు; సత్కార్యములును, కీర్తియును ఈ రెండే శాశ్వతముగానుండును.

7. భగవత్ప్రియములయిన పనుల కేధనము వినియోగింపఁబడునో, యాధనమంతయు భగవత్ప్రీతి చేతఁ దనయంతటఁ దానే పెరుగును.

---

### వివిధధర్మములు.

1. పరులకు మేలుఁ జేయుట పుణ్యము సంపాదించుటకొఱకే; కీడుఁ జేయుట పాపము సంపాదించుటకొఱకే.

2. ఈఁగలు, గాలి, భోగపుది, బిచ్చపువాఁడు, ఎలుక,

ఈయెడును పరులను బీడించును.

3. కోపమన్నిపనులను జెఱుచుటకుఁ గారణమగును గనుక, నాకోపమును విడుచువాని కన్నికార్యములును సిద్ధించును.

4. ఆఁడుది దుఃఖించుట దరిద్రము గనుక, లేనిపోనితప్పులెంచి జగడములాడి పెండ్లామును దుఃఖపెట్టఁగూడదు.

5. ఏసమయమున నెట్లునడువవలెనో, యది దెలిసి నడుచువాఁడు, తందరలేక ఫలమును బొందును.

6. చెఱువు పూర్ణముగా నిండునప్పుడు, కప్పలు దమయంతటఁదామేవచ్చి చేరునట్లు, సంపద గలుగునప్పుడు, బంధువులు వచ్చి చేరుదురు.

7. ప్రశస్తమైన బంగారములోనైనను, వెలిగారము చేరకయుండినయెడల, నదియతుకఁబడనియటుల, మనుష్యుఁడెంత విద్యావంతుఁడైనను, బ్రాపకబలము లేనియెడల, వృద్ధిలోనికి రానేరఁడు.

8. చకోరములనఁగా వెన్నెలపక్షులు, చంద్రోదయమయినందుకును, జక్కవపక్షులు సూర్యోదయమయినందుకును, సంతోషించును.

9. స్త్రీలు ఎంతతఱుచుగా నద్దములోఁజూచుకొనుచుందురో, యంతతఱుచుగా గృహకృత్యములను పేక్షించుచుందురు.

10. ఏబదిసంవత్సరములు పాటుపడి సంపాదించిన మంచిపేరు, ఒక్క యవివేకపుపనివలనఁబోగొట్టఁబడవచ్చును.

11. దరిద్రుఁడు నూఱుతప్పితములు చేసినను దనతోడివారు సయితము వానిని గణింపరు. గొప్పవాఁడొక్కతప్పితముఁ జేయునెడల నది బహుత్వరితముగాఁ బ్రపంచమంతట

వ్యాపించును.

12. వెండియు, బంగారమును, జాతిలోఁబుట్టినప్పటికిని బ్రతి జాతియందు నీలోహములు దొరకనేరవు.

13. మాణిక్యము బురదలోఁబడినప్పటికిని మాణిక్యమే యందురు; ధూళియాకాశముపై కెగసినప్పటికిని ధూళియేయందురు.

14. రాఁబోవునుపద్రవములను ముందుగాఁ దెలిసికొని వానిని నివారణముఁజేసికొనుట కుపాయములు వెదకువాఁడు మిగులసుఖపడును, అట్టియుపద్రవములు సంభవించిన తరువాతనయినఁదగినప్రయత్నములు చేసి తప్పించుకొనువాఁడు కొంతసుఖపడును, ఏమియుఁ దెలియనివాఁడు బొత్తిగాఁ జెడిపోవును.

15. బంగారుబొమ్మకు మసిపాఁతగట్టినయెడల నసహ్యముగానుండునుగనుక, అందమైనవస్తువును జక్కనివస్తువుతోనే చేర్పవలెనుగాని కురూపవస్తువుతోఁ జేర్పఁగూడదు.

16. మనుష్యుఁడు బీదవాఁడైనప్పుడు చుట్టములనాశ్రయించినయెడల వారు మిక్కిలి యల్పునివలె నలక్ష్యము సేయుదురు.

17. ఏనుఁగు బురదలోదిగబడినయెడల దానిని లేవనెత్తుటకు ఏనుఁగేసామర్థ్యముగలదిగాని పందికి అట్టిశక్తి లేదు; ఈ ప్రకారమేగొప్పవారికి ఆపదవచ్చినయెడల గొప్పవారే తప్పింపసమర్థులు.

18. కీలుబొమ్మ తనకీలూడినతరువాత నెప్పటివలెనుండక చెడిపోవునట్లు మనుష్యుఁడు తనసహజస్థితితప్పినయెడలఁ జెడిపోవును.

19. మంచివాఁడను కీర్తిని సంపాదించుటకు బహుదినములు

పాటుపడవలసియుండును; అపకీర్తి తెప్పపాటుకాల ములోనే సులభముగావచ్చును.

20. డాబుగా బట్టలుకట్టి రాజసముగా జీవించినయెడల అహంకారము గర్వము మదము గలుగుటయేగాక మోహచింత మొదలయిన దుర్గుణములు గలుగును.

21. పరుల మేలుజూచి యోర్వలేనివాఁడును రోఁతగలవాఁడును సంతుష్టిలేనివాఁడును కోపముగలవాఁడును ఎల్లప్పుడుసందేహించువాఁడును ఒకనియింటఁ గడుపుకూటికిఁ గాచుకొనియుండువాఁడునను నాలుగురును దుఃఖమునుబొందువారలైయున్నారు.

22. నీచుఁడు దనయజమానుని యెదుట నతివినయచేష్టలచేఁ దననీచత్వమును గనపఱుచును. గొప్పవాఁడు స్వభావగాంభీర్యముగలిగి యథోచితముగ నుండును.

23. వీఁడు తనవాఁడనియు వీఁడు పరుఁడనియు నెన్నుట లఘుబుద్ధులకుండును. మహాత్ములకు లోకమే కుటుంబము. ప్రపంచమున్నంత కాలము మనము బ్రదుకఁబోము. కాఁబట్టి యున్నంతకాలమందఱికిని మంచివాఁడనిపించుకొనిపోవుట శ్రేయము.

24. దుర్జనుఁడు తలఁచునది యొకటి, చెప్పునది మఱియొకటి, చేయునది యింకొకటి. సజ్జనుఁడు తలంచునదియుఁ జెప్పునదియుఁ జేయునదియు నొకటియైయుండును.

25. ముందుగాఁ జోటుఁ జూచి పాదమూని తరువాత వేఱొకటి పాదమెత్తవలెను. ఆప్రకారమే స్థానాంతరమును విచారించికొనక పూర్వస్థానమును విడువఁబూనుకొనరాదు.

26. అల్పుని యాచించుటకంటె నిప్పులోఁబడి శరీరమును గా

ల్చికొనుటమేలు; అనృతమాడుటకంటె మౌనముగా నుండుట మేలు. పరుల ధనమును దోచుకొనుటకంటె భిక్షమెత్తుకొనుట మేలు.

27. వివేకహీనుఁడైన ప్రభువును గొలుచుటకంటె వనవాసము త్తమము. యాచించుకొని బ్రతుకుటకంటె మరణము శ్రేయము. సేవకవృత్తి మానమును హరించునట్లు యాచనవృత్తి సమస్త గౌరవములను హరించును.

28. ప్రియవచనములతోడిదానము, గర్వసహితముగాని జ్ఞానము, క్షమాసహితమైన శౌర్యము, త్యాగయుక్తమైన విత్తము, ఈనాలుగును లోకమందు దుర్లభములు.

29. సర్వదానములు, సర్వవ్రతములు, సర్వయాగములు, శరణాగతరక్షణముతో సరిగావు. శరణాగతుల నుపేక్షించుకంటె నధిక పాపము లేదని ధర్మజ్ఞులు చెప్పుదురు.

30. ఉదరపోషణమునకయి పరులకు శరీరమమ్ముకొనుట మిక్కిలి హేయము; పరాయత్తవర్తనుఁడు మృతకల్పుఁడు. అయినను సేవకుఁడు స్వకృత్యములయందు స్వామిచేత మన్ననఁబడెనా, సేవా దుఃఖము గొంతనిస్తరించును. ఉపేక్షింతుఁడయ్యెనా దానికంటె దుఃఖము లేదు. పరాభూతుఁడయ్యెనేని జెప్పవలసినదేమి; కాన సేవకవృత్తిచే వచ్చుపాయసముకంటె స్వచ్ఛందవృత్తిచే లభించు గంజిమేలు.

31. హితాహిత వివేకములేక విహితకర్మములు అనఁగా విధింపఁబడిన పనులు మాని స్వోదరముమాత్రము పూరింపఁగోరువాఁడు అనఁగాఁ దనకడుపునుమాత్రము నిండించుకొనఁగోరు వాఁడు పశుతుల్యుఁడు; అంతియె కాదు, భారవాహియయి తృణమాత్రాశనమై కృష్యాదిక

ర్గములకత్యంతోపకారకమైన వృషభము నరపశువు కంటె మేలుగాదే?

32. ప్రవర్తనము తిన్నగా లేకపోయినయెడలc గోటితీర్థయాత్రలు చేసినప్పటికిని బుణ్యలోకములు గలుగనేరవు; యుక్తప్రవర్తనమువలన మాత్రమే పుణ్యలోకములు లభించును.

33. కొందఱు దుఃఖమునే సుఖమని భ్రమింతురు; తప్పత్రాగిన మనుష్యులు దానిమత్తతగప్పియున్న నాలుగుగడియలును దేహము తెలియక త్రుళ్లి గంతులువైచుచు తామే మొ సుఖపడుచున్నామనుకొందురు. విచారించిచూడcగా వారుపడునదియంతయు దుఃఖమేకాని సుఖముకానేరదు. వారు దేహముcదెలియనియప్పుడు చేసిన దుష్కార్యములమాట యటుండగా, మైకముతీఱినవెనుకcబడెడుశ్రమయుc, ద్రాగుటవలనc దమకుటుంబములకుc గలుగునష్టములును, దేహములుచెడిపోయి బహురూపముల బాధించువ్యాధులును, అందువలనవచ్చునది యంతయు, దుఃఖమేకాని వేఱొకటిగాదు.

34. అర్థనాశము, మనస్తాపము, గృహమందలి చెడ్డనడత, వంచన, పరాభవము, ఇవి ప్రచురము చేయcదగవు.

35. చెడ్డభార్య గలిగియుండుట, దుర్మార్గుc డైన స్నేహితుcడు కలిగియుండుట, గర్విమైన నవుకరు గలిగియుండుట, పామున్నయింటిలోc గాపురముండుట, ఇవి నిస్సందేహముగా చావుతో సమానములై యున్నవి.

36. మంచి ప్రవర్తనగల భార్య యమృతమువలె సంతోషము మ గలుగcజేయును. పిల్లవాండ్ర మాటలు తియ్యగానుండును. ప్రభువులయొద్ద గౌరవమును జెందుట మ

నోరంజనముగా నుండును. కష్టార్జితము వలన గౌరవముతో భోజనము చేయుట రుచికరముగా నుండును.

37. ఋణపడుట, భిక్షమడుగుట, ముసలితనము, వ్యభిచారము, దొంగతనము, బీదఱికము, రోగము, ఉచ్ఛిష్టమును దినుట, ఈయెనిమిదియు గొప్పయుపద్రవములైయున్నవి.

38. దాసియు, పనివాడుఁను, కొడుకును, చుట్టమును, వస్తువులును, బండిమొదలైన వాహనములును, ధనమును, ధాన్యమును, కలిగియుండుట ప్రసిద్ధమైన భాగ్యము.

39. పిల్లవాండ్లతోఁ జెలిమిచేయుట, నిర్హేతుకముగా నవ్వుట, స్త్రీలతో జగడమాడుట, దుర్మార్గునియొద్దఁ గొలువుండుట, గాడిదె నెక్కుట, వీనివలన మనుష్యుఁడు నీచత్వము నొందును.

40. ధనముచేత నందఱును స్వాధీనులగుదురు. ధనము లేనియెడల నిన్ను నీతల్లియే దూషించును; నీతండ్రి నిను జూచి సంతోషింపఁడు; నీయన్నదమ్ములు నీతో మాటలాడరు; నీ భృత్యుఁడు నీపైని గోపించును; నీ కొడుకు నీ వెంటరాఁడు; నీ భార్య నిన్ను కౌఁగలించుకొనదు. ధనము నడుగుదువను భయముచేత నీస్నేహితుఁడు నీతోననుతాపపుమాటలనైననాడఁడు; కాఁబట్టి ధనము సంపాదింపవలెను.

41. వ్యసనము, సొద, అను నీరెంటిలో వ్యసనమే హెచ్చయినది. ఎందుచేతననఁగా, సొద, ప్రాణములేనిదానిఁ గాల్చును; వ్యసనము ప్రాణముతోఁ గూడుకొనియున్న శరీరమును, గాల్చును.

42. పచ్చికాయను బండవేసినయెడల, నదిపండక యెండినయటుల, నాత్రపడి చేసినకార్యము, నెఱవేఱకపోవును.

43. ఉప్పును, కప్పురమును, రూపముచేత నేకరీతిగ నున్నను రుచిచేత భేదము కలిగియున్నయటుల, మనుష్యుల, లోఁ గొందఱు సత్పురుషులుగాను, గొందఱు నీచులుగాను, నుందురు.

44. యజమానుఁడు తనభృత్యులయెడల ననుకూలముగానున్నప్పుడు, వారుతప్పితములు చేసినప్పటికి, నవి తప్పులుగాఁ దోఁచవు; అతఁడు ప్రతికూలముగానున్నప్పుడు, సరియైనపనిఁ జేసినప్పటికి, నది తప్పుగానే కనఁబడుడుమ గనుక, బుద్ధిమంతులు, కార్యాకార్యములెఱిఁగి నడుచుకొనవలెను.

45. తియ్యనిపదార్థములు దినుటయు, బహుజనులు నిద్రబోవుచుండఁ దానుమేల్కొనియుండుటయు, ఏకార్యమునుగుఱించియైన నాలోచనము చేయుటయు, మార్గమందొంటరిగా నడుచుటయు, నొకనికిఁదగవు.

46. దుర్జనులకు సంపదగలిగినను విద్య సంప్రాప్తమయినను అపరిమితగర్వము గలుగును. ఇవియె సత్పురుషునకుఁ గలిగెనేనిఁ దామతివినయముగలవారుగాను నమ్రతగలవారుగాను బహుజనశ్లాఘనీయులుగాను నుందురు.

47. సంపద బంధువులను స్నేహితులను గలుగఁజేయును. సంపదయే పురుషునిబరాక్రమముగలవాఁడని యనిపించును. సంపదగలవానిననేకులు మంచిబుద్ధిగలవాఁడని చెప్పుదురు. సంపదలేనివానికి భోజనము మొదలైన సౌఖ్యములుండనేరవు. కాఁబట్టి తనశరీరమందున్నరక్తము సయితము తన్ను విడిచిపోవును; అట్లుతనశరీరమందున్నరక్తమే తన్నువిడిచిపోవునపుడు భార్యయుఁ జెలి

కాంద్రుఁడును దన్నువిడిచిపెట్టిపోవుట యాశ్చర్యమా?

48. తనరాబడికంటె ప్రయధికముగఁ జేయునెడలఁ దాను గుబేరునంత ధనవంతుఁడైనను గడ్డిమోసి యమ్ముకొనవలసివచ్చును? ఆర్జనకంటెవ్యయము తక్కువగా నుండునెడలఁ దానుబేదవాఁడైనను గుబేరునితో సమానుఁడౌను. సంపదగల వెట్టివానినైనను లోకులు స్తోత్రముఁజేయుదురు. సంపదదొలఁగిపోయినచో నిందింతురు. కాఁబట్టి దారిద్ర్యముకంటె కష్టము వేఱొకటిలేదు.

49. వృక్షములు ప్రయత్నములేకయే కాలమందెట్లు పుష్పఫలములతోఁగూడుకొనియుండునో, ఆప్రకారమేసుఖదుఃఖములు కాలమువచ్చినప్పుడు ప్రయత్నము లేకుండనే సంభవించును.

50. విశేషదయగలవాఁడు కాలమునకుఁదగినదానిని మనస్సునందుయోచించి కఠినముగా మాటలాడినయెడలఁ దప్పక లాభము గలుగును. మేఘము గర్జించినతరువాత వర్షముగురిసి మనపంటలు మొదలైనవానికి లాభముఁ గలుగఁజేయలేదా?

51. అగ్ని కాలుచునుండువఱకుఁగట్టె ప్రకాశము గలిగియుండును. అది యాఱిపోయినతోడనే యాకట్టెకు నలుపురంగుగలుగును; ఈప్రకారమే యదృష్టము రాణించువఱకు మనుష్యునిరూపు ప్రకాశించుచుండును. అదృష్టము మఱలినతరువాత రూపు బొత్తిగామాఱిపోవును.

52. నీచుఁ డెంతప్రయాసపడినప్పటికిని బుణ్యపురుషునకదృష్టమువల్లఁగలుగు సుఖానుభవము నెంతమాత్రమును బొందనేరఁడు. మదపుటేనుగుల కుంభస్థలమునందుండు మాంసము సింహము తలంచినతోడనే దొరుకునుగాని

యేవిధముచేతనైనను నకఱకది సంప్రాప్తమవునా?

53. గొప్పబలముగలవాఁడు దనబలమును గ్రమముగా నుపయోగ పఱుచుకొననియెడల నాబలమువలననే తాను జెడును. ఎట్లనఁగాఁ జెఱువుగొప్పదైనను దానికట్లుబలహీనములై యున్నయెడల నీళ్లధికమైనప్పుడు నడుమఁదెగఁగొట్టఁబడి నీరుపాఱిపోవునుగదా?

54. గొప్పవాఁడు కష్టదశను బొందినయెడల నొక మంచిప్రభువే తిరిగి యతనిదారిద్ర్యమును బోఁగొట్టఁగలఁడుగాని నీచులెందఱైన నతనిస్థితిని బాగుచేయఁజాలరు; ఏలాగున ననఁగాఁ బెద్దచెఱువెండిపోయినప్పుడు మేఘముతప్ప వేలకొలఁదితుంపరలు తృప్తిఁబొందించుటకు సమర్థములగునా?

55. దైవానుగ్రహము దప్పినయెడల నెంతగొప్పవాఁడైన నల్పునిచేతఁగూడ బాధపడవలసివచ్చును; అతిశయించిన మదపుటేనుఁగుపైని మావటీఁడెక్కి యదరించి బెదరించిన నది వానిని సహించుకొనియుండదా?

56. దుర్మార్గుని స్వభావముఁ దెలిసికొనక వాండ్రకు బుద్ధిచెప్పుటకెవ్వరును సాహసింపఁగూడదు; ఇది వాని కోపమును రగులఁబెట్టును; కాఁగిననూనెలో నీటిబొట్టుపడఁగానే పైకిలేచి భగ్గునమండిపడదా?

57. తనయదృష్టము బాగుగనుండనియెడల నితరులకలిమివలనఁ దనకుఁబ్రయోజనము గలుగనేరదు; కన్నులుగలవారు తప్ప గుడ్డివారు చంద్రుఁడు ప్రకాశించుచుండఁగా నా వెన్నెలవలనఁగలుగుసంతోషము ననుభవింపనేరరు.

58. సమర్థుఁడైన న్యాయాధిపతియే న్యాయపరిశీలనముఁ జేయఁగలఁడుగాని యసమర్థుఁడు చేయలేఁడు; క్షీర

మును జలమును గలిసియున్నప్పుడు వానిని వేఱుపఱు
చు సామర్థ్యము హంసకే కలదుగాని పిల్లికిఁగలదా?

59. జనులు దమకుఁ దెలియనిపనిని నెఱవేఱుచుకొనుటకొక తె
లివిగలమనుష్యుని సాహాయ్యమును సంపాదించుకొనవ
లెను. అట్లుచేసినయెడలఁ దమకార్యములు కొఱఁతలే
కుండఁజక్కఁబడును; నొసటను బొట్టుపెట్టుకొన్నప్పు
డు చేతియందద్దముగూడ నున్నయెడల నాయద్దమును
జూచి బొట్టుసరిపఱుచుకొందురుగదా?

60. దక్షతలేనియింటి కెంతయాదాయము వచ్చినను నిష్ప్ర
యోజనమై చెడిపోవును. ఒకచెఱువులో నెన్నిప్రవా
హములువచ్చిచేరినను గట్టు దిట్టముగా నుండనియెడల నీ
రునిల్చునా?

61. మాటలాడుటకు సామర్థ్యములేనివారు తప్పుగా మాట
లాడినప్పటికిని వివేకులందఱును గనికరింతురుగాని గ
ద్దింపరు. తప్పటడుగులు వేసెడిపిల్లలను బెద్దవారు ము
ద్దుపెట్టుకొందురుగాని పడఁద్రోయరుగదా?

62. నీచుఁడున్నతదశను బొంది పీఠముపైఁగూర్చుండి యున్న
ప్పటికిఁ దనకంటెఁ గ్రిందుగాఁ గూర్చుండు విద్వాం
సుల గౌరవమునకుఁ గొఱఁతరాదు. కోఁతిచెట్టచివరకొ
మ్మపైఁగూర్చుండియుండఁగా దిగువను సంచరించు గం
డభేరుండపక్షులు, పులులు, సింహములు మొదలైన
వానికి గౌరవముతగ్గునా?

63. మనుష్యుఁడు బలవంతుఁడుగా నున్నప్పుడు తనబంధువు త
నకు సహాయుఁడగును; బలము తగ్గినతోడనే యాబం
ధువే తనకు పగవాఁడగును. అగ్ని బలముగలిగి యడవినిగా
ల్చుచున్నప్పుడు గాలి దానికి సహాయమగును; ఆయగ్ని

